దమునకు




సహారా
బ్లేడు
10
వన్నని
క్షౌరమునిచ్చును
6 అణాలు
5 బ్లేడ్లు
పొట్లము.






సుప్రసిద్ధ లోకామయహార
కస్తూరి మాత్రలు
జలుబు, జ్వరము, దగ్గువగై
రాలకు చాల ఉపయోగము.
సీసాకి రు౦-౮-౦.
శ్రీసీతారామవైద్యశాలయం
మైసూరు
ఏజంట్లు:-చా ౹ లాలు వారా
యణజీ అత్తరు వ్యాపారులు
హైదరాబాదు దక్కన్.



కలరా భయములేదు కలరా భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

విక్టర్ డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును, రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్ డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రములనొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

హోల్ ఏజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు.





ఆలస్యంచేసేరు
జాగ్రత!

ఆలస్యంచేస్తేరోగం బాలబాలికల ఆరోగ్యాన్ని పూర్తిగా నాశనం చేసివేస్తుంది. లివర్ అండ్ స్ప్లీను వ్యాధి జాడలు యేమాత్రం కానుపించినా వరే వెంటనే బాల భాస్కరను యీయండి! దానితో ఆవ్యాధి యొక్క లక్షణములన్నీ మాయమైపోతవి. బిడ్డలకు పునరారోగ్యం లభ్యమౌతుంది.




బాలభాస్కర

లివర్ అండ్ స్ప్లీన్‌వ్యాధులకు
పరమప్రక్రియ

ఆయుర్వేదాశ్రమము.
(స్థాపితము 1898)
మదరాసు.

స్టాకిస్టు —
హైద్రాబాదు:—
కింగ్ అండ్ కంపెని, అఫ్జల్‌గంజ్
సికింద్రాబాదు:—
రామకృష్ణస్టోర్సు, మార్కెట్ స్ట్రీట్
డి. జె పటేల్ అండ్ కంపెని, జుమ్మామసీద్,



పదికోట్ల
రూపాయిలకు పైగా

హిందుస్థాన్ కో ఆపరేటివ్ ఇన్సూరెన్సు కంపెనీలో ప్రజలుభీమా చేసి యున్నారు ఎందుకనగా-

గొప్పనమ్మకముగలకంపెనీ

లోకల్ ఆఫీసు:— సెంట్రల్ బ్యాంకు బిల్డింగ్సు మొజ్జాంజాహిమార్కెట్టు.


# నన్నయ్యకాలపు నారీమణులు

## భారతకాలంలో వివాహానికి ప్రేమయే ప్రధానముగాని వర్ణవయోభేదాలు పాటింప బడకుండేవి

స్త్రీలను కేవలం ముగ్ధలుగా, అబలలుగా నన్నపార్యుడు నిర్ణయించిన పాపానపోలేదు

"శ్రీమతి కోరాడ భూషణమ్మ"

దేవయాని

శుక్రునివద్దను సంపాదించి మృతసంజీవని విద్యబడని రణనిహతులైన సురనికాయానికి పరమోపకారంచేసినవాడు బృహస్పతి పుత్రుడైన కచుడు. ఈకచునివర్తన చాలా సమంజసంగావుంది. అవతల వారిని వశపరచుకొని తనపని నెరవేర్చుకోవడంలోనూ, ఆ సందర్భములో ఎవరెవరిని ఏవిధంగా లాలించాలనో ఆపాయంట్లన్నీ బాగా అనుకరించాడు. దేవతలకొకటిటుకు తెలుసున శుక్రునకు కూతురంటే మితిలేని అనురాగమనీ, ఆమెను ముందు వశపరచుకుంటే అతన్ని సాధించడం సులభమనీ, ఇక ఆయువతీమణిని తగురీతి బుజ్జగించి వశపరచుకోదగినవాడు కచుడనీఎరిగి దేవతలాతనితో ఇట్లా చెప్పారు. "మహిత స్నేహంబునజేసి యు దేవయాని పలుకులు శుక్రుండతిక్రమింపడు నీనేర్పువిధమున దానిచిత్తమువడసి శుక్రునారాధించిన నీకు యిష్టసిద్ధికలుగు"నని అతనికి నేర్పించారు, అకచుడుకూడా విశేష విద్యావంతుడూ, నియమవ్రతశీలుడూ గనుక ఆ దేవకార్యంలో పూర్తిగా జయం సంపాదించాడు. తనకు చెప్పినపనులు తక్షణం చేయడం, అతని చిత్తవృత్తి కనుకూలంగా మెలగి గురువును ఫలపుష్పవిశేషదానముల చేత, ప్రియమధుర భాషణముల చేత గురుతనూజనూ సేవించి తన నేర్పు కొలది వారిని మెప్పి బడసినాడు.

కాని కొంచెం తికమక జరిగింది వారిద్దరికీ. కచునకు దేవయానికీ ఒకరిఉద్దేశం మరొకరికి తెలియలేదు. తన కార్యసాధనానుకూలతకు ముఖ్యసాధనమైన దేవయానిని పవిత్రేవరకు సంతోషపెట్టడమే కచుని ముఖ్యోద్దేశము. దేవయాని నెట్టుకుచాలామారం పోయింది. అతనిహృదయమే బొత్తుగా కనిపెట్టలేదు. తనవలెనే అతడూ ప్రేమిస్తాడనుకొంది. ఒకరిఉద్దేశం కనిపెట్టి మెలగవలసిన అవశ్యకత ఆమెకు లేకపోవచ్చును. ఏలనంటే ఆమె చాలా గారాబంగా పెరిగింది. తండ్రికూడా "నాకు నీకగట"యని ఆమెపట్ల ప్రవర్తించుటచేత దేవయానికొకవిధమైన స్వాతంత్ర్యమూ, పట్టుదలా, మంకుతనమూ ఏర్పడ్డాయి. తనయిచ్ఛకు అనందానికీ ఏమాత్రం వ్యతిరేకం కలిగినా ఆమె సహింపలేకపోయేది. నిజానికి దేవయాని నిష్కల్మషహృదయంతోటి కచుని ప్రేమించింది. మొదటిసారి అతడు దానవులచేత చంపబడినప్పుడామె విచారించింది. "నా ర్యాస్తమానమైనది. ధేనువులేక తమి వచ్చినవి అతనురాలేదు" అని దేవయాని తండ్రిదగ్గరకుపోయి దుఃఖించుటచేతనే కదా కచుడు జీవింపగలిగినాడు. రెండసారి చచ్చి బూడిదయై శుక్రుని గర్భాలయంలోకి పోయినాడు, అప్పుడుకూడా అతనిపోకడకు దుఃఖించినదామె. "అతడు సుగతిచెందును. విచారించవద్దు" అని తండ్రి చెప్పినా అమె వినలేదు. వానింజూచిన కాని మడువనని కూర్చుంది. ఈసందర్భంలోనే, మృతసంజీవనీ విద్య కచునకు కరతలామలకమై పోయింది.

అంతే, అక్కడితోటి అతనిపని తీరినది. దేవలోకానికి పోతున్నాడు. శుక్రునుజ్ఞతీసుకొని దేవయానితోటికూడా చెప్పినాడు. అమె కూడా వియోగానికి దుఃఖించి

"రవి తేజ వివాహమునీకునాకుమున్
భావజశక్తినైన యది పన్నుగనన్ను
బరిగ్రహింపుము"

అని తనహృదయం చాటుమాటు లేకుండ బలిపెట్టినది. కచుడప్పుడు ధర్మపన్నాలు ఏకరువుపెట్టినాడు. తిరస్కృతయైన దేవయాని కోపావేశంతో కచుని తిట్టింది అతనిచేత తిట్టుపడ్డది. ధర్మనిర్వహణంలో స్థితి విజ్ఞుడైన కచుడుకూడా ప్రశంసార్హుడనవచ్చును.

ఈవిధంగా దేవయాని తొలిప్రేమ విఫలమైపోయింది. తరువాత ఆమెప్రేమ యయాతివైపుమళ్ళి అతన్ని చుట్టివేసింది. దానవేంద్రుని కూతురు శర్మిష్ఠ, కన్యకాసహస్రంతో దేవయానిసహితంగా జలక్రీడలాడే సందర్భంలో గాలికిమూలి వస్త్రములు తారుమారయినవి, దేవయానిచీర శర్మిష్ఠ ధరించింది. దేవయానిమాత్రం ఆమె చీరకట్టలేక,

లోకోత్తర చరితుండగు
నాకావ్య తనూజనీకు నారాధను,నే
బ్రాకట భూసురకన్యను
నీకట్టిన మైలకట్ట నేస్తనె చెప్పుమా?

అని ఈసడింపుగా మాట్లాడింది. శర్మిష్ఠకప్పుడు ఈమెను హేళనచేయాలని బుద్ధిపుట్టినది. "మాఅయ్యనుదీవించి, ప్రియము మీఅయ్య చేస్తాడు. నాకట్టగట్ట నీకతగిదా"అని అమె నెగులాడి నూతద్రోచిపోయినది. వేటకనివచ్చిన యయాతిమహారాజు అప్రయత్నంగా అమె పడివున్న నూతివద్దకువచ్చాడు. నీటికోసంతొంగిచూచి వరుణదేవిని బోని దేవయానిని చూచాడు. జాలిపెంపున, తనదక్షిణ హస్తంతోటి అమెనడిచేయిపట్టి లేవదీశాడు కేవలం కృపాబుద్ధితోటే ఈపనిచేశాడు. కాని వేరు వుద్దేశమతనికి లేనేలేదు. దేవయాని యాత్రమతన్ని భావనతోటి ప్రేమించింది.

నన్నుఁ బాహమై నహుషనందన
యీలలితాంగి దొట్టి
యీకన్నియలందరున్ దివిజ
కన్యలతో నెనయైన వారు
నీకున్నతి బ్రీతిసేయగ నృపోత్తమ
వాసవుబోలి లీ.లతో
నిన్నరలోక భోగము లనేకము
లందుము నీవు నావుకున్.

యయాతికి కొంచెం ధర్మసందేహం కలిగింది. దాన్ని శుక్రులవారు దీర్చివేశారు."యయాతికి నీకునైన యీవివాహంబునం దపక్రదోషంబు లేకుండెడు మని వరమిచ్చినాడు" అంటేభారతకాలంలో పరిస్థితులీవిధంగా ఉండేవన్నమాట. ప్రేమయే ప్రధానంగాని వర్ణభేదమును వయోభేదములు పాటింపబడేవి కావనవచ్చును.

(అ) శర్మిష్ఠ

దేవయాని దాసియైన శర్మిష్ఠకు అమెతోడి దేలోకం. వేరే సంరక్షణకర్మ లామెకులేవు కొంతకాలం జరిగిపోయింది యౌవనవతియైన పిమ్మట శర్మిష్ఠకు పతిలేనిలోపం నాటింది అపత్యాపేక్ష సంసారసుఖము, భర్త అనురాగం సంపాదించడం మొదలైన విషయాలిక్కడ చాలాహృద్యంగా వర్ణింపబడ్డాయి.

పతిబడసి సుతులబడయగ
సతివలు కోరుదురు కోరినట్టుల
దనకున్

పతిబడసి సుతులబడసెను
సతులీభార్గవికి భాగ్యసంపద నెనయే.

అని శర్మిష్ఠ దేవయానినిచూచి ఎంతోముచ్చటపడినది రాక్షసరాజు కూతురైనప్పటికీ శర్మిష్ఠప్రకృతిచాలా శాంతంగా నేవుంది, బాల్య చాపల్యంచేత ఒకమారామె దేవయానిని అవమానపరచింది. పిదప తండ్రిమాట కెదురుచెప్పక వినయ వినమితయై దేవయానికి సేవకురాలైనది. కోరినరీతిగా నేర్పు ఉపయోగించి యయాతికి తనయందు అనురాగంపుట్టించి, అతనినే పతిచేసికొని దేవయానితో సమానురాలై అమె కనూవ పుట్టింపగలిగినది. దేనికయినా ఒప్పుతారు కాని స్త్రీలు తోడివారిలో లక్కువ యాటకు ఒప్పరు, ఈవిషయం నన్నయకవీంద్రుడు గుర్తించినవాడుగనుకనే ఈకథలో చక్కగా పొందుపర్చినాడు.

(ఇ) జరత్కారువు

స్త్రీలను కేవలం ముగ్ధలు గానూ, ఏమియు నేరని అబలలనైనూ నన్నపార్యుడు వర్ణింపలేదు. వారికికూడా ఒక వ్యక్తిత్వమూ, ధర్మాధర్ములను నిర్ధారించే శక్తి అవశ్యకమయినప్పుడు ధర్మముకొరకు స్వలాభమునయినా త్యజించగల సామర్థ్యమూ కలుగజేసినాడు. ఈలక్షణములు కొన్ని జరత్కారు మహాముని భార్యయైన జరత్కారువునందు మూర్తీభవించినవి పరమ తపోనిధియైన జరత్కారుడు దారపరిగ్రహము చేయక, వ్యామోహపాశ బంధచ్యుతుడై బ్రహ్మచర్యము నవలంబించెను. అధఃపతులుగానున్న పితృదేవతల నుద్ధరించుటకు వివాహము కొరకు సనామ్నియైన కన్యను జరత్కారువును వరించినాడు. ప్రథమ సమాగమములోనే అమెకొక కఠినమైన అజ్ఞకూడా ఇచ్చినాడు, నాకు వ్యతిరేకంగా కలదినప్పుడు నిన్ను వదలిపోదునని ఖండితంగా చెప్పినాడు.

వాలుపయి నడచు నట్ల
య్యాలిక నడచుండగి భయమున
నియమా
ధీలుడగు పతికి బవళుల్
రేలును నేమఱక బరిచరించుచు —
[illegible] నుండెన్.

ఈ విధంగా పాతివ్రత్యాన్ని జరత్కారువు ప్రదర్శిస్తూనే ఉన్నది. అమె అచ్చంగా పతివ్రతయే కావండా విచక్షణ జ్ఞానం కలదికూడా గనుక విద్యుక్తధర్మానికి లోపం కలిగినప్పుడు సవరింప బూనుకొన్నది. ఒకనాడామెభర్త సాయంసమయమున అమె తొడమీద తలపెట్టుకొని నిద్రించెను, సాయంకాలపు కృత్యములకు వేళ దాటిపోతూందని అమె విచారించి అయనను లేపవలసివచ్చింది పతి అజ్ఞ దాటుట దోషమే కావచ్చును అతడు లేవనిచో ధర్మలోపం కలుగుతుంది. లేపినయెడల కోపగిస్తాడు. ఈ విషమసంధిలో అమె ఒక నిశ్చయానికి వచ్చింది. పెనిమిటి అలుకయేపడవచ్చునుగాని ధర్మక్రియా లోపం సహించరాదని భర్తను ప్రబోధించి అతనికోపానికి పాత్రురాలైనది.

(ఈ) గంగ

గంగా శంతనులకు వయోభేదమెంతో గలదు. అమె తనకంటె చిన్నవాడైన మొగుణ్ణి పెండ్లాడినది. పుత్రుని ప్రేమించి పెండ్లాడదలచిన గంగయే అతనికొడుకును వరించి భార్య అయింది. తండ్రి నాటి స్త్రీని శంతనుడు పెండ్లాడివాడంటే వారిరువురులో వయోభేదం చాలా ఉండిఉండాలిగదా. తన సుఖముల ఎదుట గంగ అడువారికి సహజమైన సంతానానురాగంలో కూడా లోపంచేసి చివరకు శంతనుని చేత ప్రబోధింపబడివిరక్తయై సంసారం వదలి ఇచ్చవచ్చినచోటికి పోయింది. అ కాలంలో నియమాలూ, కట్టుబాట్లూ లేవు. మనసుకు వచ్చినరీతి స్వైరవిహారం చేయడం ఒకతప్పుగా పరిగణింప బడలేదు.

(ఉ) ద్రౌపది

మహాభారతమునకు ముఖ్య ప్రకాశకురాలైన ద్రౌపది నెఱుగనివారు అరుదు. మహానుభావుడైన నన్నపార్యుడు అమెను అబలగానూ, సబలగానూకూడ చిత్రించినాడు. కౌరవ పాండవులకు నాటిన పతిమతల్లులలో ద్రౌపది పేరెన్నికగన్నది. కార్యనిర్వాహణమునం దామె బహుదక్షురాలు గనుకనే పతులను వశపరచుకొనే విధులలో గృహకార్యభారమంతయు నామైన ఉంచి నాపతులేవురూ నిశ్చింతగా ఉంటారని సగర్వంగా చెప్పగలిగింది. ద్రౌపది అనుష్ఠించే గృహిణీ ధర్మములు సామాన్యంగా రాచదేవేరులైన స్త్రీలయందు కానరావు. అనేక దాసదాసీజను లున్నప్పటికీ తానే స్వయముగ పతులెదురుగను స్నానపాన భోజనాదిసౌకర్యములు నేర్పర కలిగించుట, అత్తగారైన కుంతీదేవిని నియమప్రకారం సేవించుట, అనేక పరిజనుల క్షేమం నిత్యమూ విచారించుట మొదలయిన లక్షణాలు అమెయందు ప్రత్యేకంగా కానబడుతాయి. కపటద్యూతానంతరం దుర్యోధనుని పంపున తన్ను దోడ్కొనిపోవుటకు ప్రాతికామి వచ్చినప్పుడామె తన మనస్థయిర్యమూ, ధీరతా, తేటపడేటట్లు ఈ విధంగా ప్రశ్నించింది.

ముమ్ము దన్నోటు వడిమతి నన్నునోటు
పడియెనో, నన్నమునోటువడి విభుండు
గ్రన్నతన్నోటు వడియెనో యన్న నాకు
నెఱుగజెప్పుము దీని నీ వెఱుగుదేని.

మహాప్రముఖులుగల అనాటి కౌరవసభలో కూడ విదుషీమణియైన ద్రౌపది ప్రశ్నకు సమాధానం దొరకనే లేదు. అమె ధర్మవివక్షత, బుద్ధి, వికదీకరింపబడే ఘట్టాలు కొన్ని చాలా గొప్పగా వర్ణింపబడుతూంటవి. సకలబాంధవ హితము చేయదలచి ధృతరాష్ట్రుడామె కోరిన రెండువరములిచ్చి మూడవ వరము వేడుమనినప్పుడామె ధర్మసూక్ష్మ మిట్లు వివరించెను.

వైశ్య సతికి నొక్క వరము క్షత్త్రియ
సతికి రెండు శూద్ర సతికి మూడు
విప్రసతికి నూరు వేడ జను వరములు
గాన యింక వేడ గాదు నాకు.

సభ్యులంతా మెచ్చుకున్నారు ద్రౌపదిని.

(ఊ) హిడింబ

నన్నపార్యుని స్త్రీపాత్రలు కేవలం ముగ్ధలు మాత్రంకాదు అట్లని వారియందు ఉత్తమనాయికా లక్షణములులేవని చెప్పుటసాహసము. వారొక్కొక్కరి వడవడిచూడగా అనాటి సాంఘిక సమత్వమునూ, మానవ ప్రకృతికి సహజమైన కోమల భావములు 'వివాహములూ ప్రత్యేక వ్యక్తిగతంగా మనకు తేటతెల్లమవుతవి. సామాన్యముగా అందరిస్వభావము ఒక్క మాదిరిగా నుండదు. ఒకరికి రుచించినది మరొక్కరికి విషప్రాయముగా కనుపించవచ్చును. పుట్టుకోకబుద్ధి పూరికొకదోవ అనే సామెత వాటిలో కొందరిది ఉగ్రప్రకృతి కొందరిది శాంతప్రకృతి, మరికొందరిది తెలియని ప్రకృతి ఇట్లావుంటాయి. హిడింబ భీమసేనుని వరించడంలో వ్యక్తిగతవ్యక్తమగును. హిడింబ ఇదివరలో భీముని చూచినట్లుకూడా లేదు. రాక్షసి. అన్నగారి అజ్ఞప్రకారం పాండవులను చంపడానికి

భీమసేనుని
రైనది.
రమ
గస


మీదంతముల విషయమై
డా. బి. ఆర్. నాయక్,
డెంటల్ సర్జన్,
వియన్నా యూనివర్సిటీతో
విచారించుడు
1162, గుల్‌బాగ్
ఎక్సెల్సియర్ సినిమా ప్రక్కన
హైదరాబాద్, దక్కన్.



ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన బీజ్ బంద్ 24 గంటలలో అద్భుత గుణము నిచ్చును

మద్రాసు ఆర్య వైద్యాశ్రమంవారి మందు.
వకసారి తెప్పించి వాడినచో నీకే తెలియును.

దురభ్యాసముల వల్లగాని, ఇతరకారణముల వల్లగాని, నీరైన వీర్యమును గట్టిపరచును. నపుంసకత్వమును తొలగించును. నరములకుబలమునిచ్చును. సంసారసుఖము నిచ్చును. సంతానవంతులుగ జేయును. ముసలివారలకుకూడ మంచిగుణమిచ్చును. 2 సీసాల ఔషధం సేవించినచో పూర్తిగాగుణమిచ్చును. మందు వాడువిధము మందుతో తెలుపబడును.

20 మాత్రలసీసా 1కి రు 2-8-0 విపి చార్జి వేరు.

ఆంధ్రశ్రీ కంపెని,
పుస్తక వ్యాపారులు,
230, సుల్తాను బజారు,
హైదరాబాదు దక్కన్.



జాగ్రతగల ప్రయాణీకుడు బాధ్యతనువహింపడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటనుంచుకొనుట బాధాకరమును అపాయకరమునైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచినయెడల

సెంట్రల్ బ్యాంకుయొక్క
ట్రావెలర్స్ చెక్కులను ఉపయోగింపుడు

అవి:—
1. నష్టముకలుగకుండ కాపాడును.
2. రొక్కముకంటె సులభముగా తీసికొనిపోవచ్చును.
3. 25,50 100 రూపాయిలు మొత్తములలో దొరుకును.
4. హెడ్డాఫీసులోను ముఖ్యమైన బ్రాంచీలలోను దొరకును. ఏబ్రాంచిలోనైనను ఆఫీసులో పేసైనను నగదు యివ్వబడును.



మీబిడ్డ తల్లులకు
ఆయుర్వేదభూషణ పండిత నోరి రామశాస్త్రులవారి

శ్రీ దేవధారిని

(రిజిష్టర్డు)
క్షీరవర్ధని
ఇచ్చి

మీబిడ్డలను తల్లిపాలతోనే పోషింపుడు. తల్లిపాలవలన పెరిగినపిల్లలకు లివర్ అండుస్ప్లీన్ వ్యాధులురానేరవు, పిల్లలపాలిటి కామధేనువు. తల్లులపాలిటి వరప్రసాదిని. తండ్రికివ్యయముతగ్గించును.

ఆయుర్వేదనిలయం బెజవాడ.

స్టాకిస్టులు:- మెసర్సు కింగ్ అండుకో, కెమిస్టు,
అఫ్జల్‌గంజ హైద్రాబాదు-దక్కన్.
25A. ఒస్సిలాలుపేట, సికింద్రాబాదు.



బిల్డింగు ప్లాట్లు

400 గ. మొదలుకొని 1000 గ. వరకు చౌకధరలకూ

హుస్సేనుసాగరు చెరువు కట్టదగ్గర హైదర్‌గూడ

మొదలగు స్థలములలో గలవు

కావలసినవారు త్వరపడుడు.

రాజు అండ్ కంపెని
జాఫ్రీ మార్కెటు దాపున,
చాహిరోడ్డు
దక్కన్.

# గోల్కొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

HYDERABAD - DECCAN

**Thursday 25 Th November 1937**

Number 55


ఓరము నవ ౨౨

...కార్యదర్శి కార్యా ...మతో, కోశాధ్యక్ష, వసతి ...ముతో విరలనగరము సంచలనమునకు రంగముగా మారుచున్నది. మహాసభ సమావేశమునకు రెండుమాసములన్నర వ్యవధియే గలిగియుండుటవలనను, యింతవరకు పనులు త్వరగా జరుగకుండుటచేతను ఆహ్వాన సంఘమువారు నిర్మాణ కార్యక్రమములన్నియు చురుకుగా పూర్తిగావించుటకు ప్రయత్నించుచున్నారు.

ఈ ఆదర్శములతో కనయ్యాలాలుదేశాయి, నగర నిర్మాణాధికారియగు రాందాసుగారలు యితర కార్యకర్తలతో సంప్రతించుచుత్వరలో నగర నిర్మాణము, వసతియేర్పాటులు పూర్తిగావించుటకు మార్గముల సిద్ధపరచుచున్నారు.

ఈ కార్యము పరిపూర్తియగుటకు అనుభవముగల కొందరిఅమూల్యసేవ అత్యవసరములనియు, సాయము చేయదలచినవారు వెంటనే తమకు తెలుపుట ఉచితమనియు, వ్యయములను పరిపోషించుటకు సమకూర్చుటకై ఆహ్వాన సంఘమునందు విరివిగా సభ్యులుగాచేర్చు కార్యము శీఘ్రముగా జరుపుట ముఖ్యమనియు, దీనికై అధికారులు సంచారము చేయుచున్నారనియు కనయ్యాలాలుగారు పత్రికా ప్రతినిధితో తెలిపిరి.

వసతిసౌకర్యములు, భోజన సౌకర్యములు, నీటి అనుకూలములు, దీపముల యేర్పాటు కార్యములు ప్రస్తుతము జరుగుచున్నవి.

ఈ మహాసభకు జనులు లెండోపలెండములుగా రాగలరని విశ్వాస ముండుటచే వసతి గృహముల ప్రత్యేకింప దలచినవారు ఋసులు అడ్వాన్సుగాపంపుట ముఖ్యమని దేశాయిగారు తెలుపుచున్నారు. ప్రేక్షకులకు పాలు సప్లయి చేయువిషయము ముఖ్యమైనందున గోశాలాధికారులగు శ్రీహరిపారిఖు, రాందాసు గారలు పూర్తిగావించుటకు ప్రయత్నించుచున్నారు. హరిపురమునందు౫౦౦ గోవులు తీసుకొనబడును. పాలవిషయమునందు ప్రవీణులగు శ్రీవినకరరావుపాండ్యే, పన్నాలాలు జావేరిగారి ప్రత్యేకపర్యవేక్షణముక్రింద ఖర్చుము నిర్వహింపబడును. గోక్షీరములనుండియే పెరుగు, వెన్న, నెయ్యి తయారుచేయబడును. ఝండా చౌకుకు యెదురుగా బజారు సిద్ధమైనది. ఈమాసాంతములో పోష్టు, టెలిగ్రాఫు కార్యాలయములు స్థాపింపబడును.

వంటశాలల్లో దంపుడుబియ్యము, చేతితో విసిరినపిండి, గోఘృతము వాడబడుచున్నవి.

నర్మదా నదియొడ్డున సుందరమగు గుడిసె యొకటి సర్దారు పటేలుగారి నివాసమునకు నిర్మింపబడుచున్నది.

## ౯౨ మంది బాలికలు గొడ్రాళ్లుగ చేయబడుట

అమెరికాలో కంసాస్ స్టేటులో బెలియట్ నందలి స్టేటు ఇండస్ట్రియల్ స్కూలులో ౯౨ మందిబాలికలు (అందరు ౧౮ ఏండ్లు నిండనివారు) ఆపరేషన్లచే గొడ్రాళ్లుగ చేయబడిరి తల్లిదండ్రులు ఎంతమొత్తుకొన్నను లాభము లేకపోయెను.

## నిజాంరైల్వే నూతన కృషి

ఏడులక్షలకు నాలుగు రైలు డబ్బాలు

హైదరాబాదు: నవ ౨౪

నిజాంరైల్వే అధికారులు పెద్ద లైనునందు ఉపయోగించుటకు ఉత్కృష్టమాయు ప్రసారకములగు నాలుగు రైలుడబ్బాలను కొనుటకు తీర్మానించియున్నారు వీనికి సుమారు యేడు లక్షల రూపాయిలు వ్యయమగునని అంచనా వేయబడినది.

## శ్రీవీరాంజనేయాలయము తాడ్ బందు

ఈపుణ్యస్థలము సికింద్రాబాదునకు కడుసమీపమునయున్న తాడుబందు అనే గ్రామమునయున్నది. ఈస్థలమున ప్రప్రథమమున కేవలము మూర్తివిగ్రహముమాత్రముండెను. సికింద్రాబాదు వైశ్యప్రముఖులగు బూరుగు వీరయ్యగారు ౧౫ ఏండ్లనుండి చేయుచున్న కృషిఫలితముగా ఈస్థితికి రాగలిగినది. శ్రీ వీరయ్యగారే శ్రీవీరాంజనేయ భక్తసమాజమును స్థాపించి పాలకవర్గముగా ఏర్పరచిరి. సుమారు ౧౬ వందలవరకు ఈఆలయమునకై వెచ్చింపబడినది. ఇట ప్రతివత్సరము శ్రావణ॥ ౩౦ ఉత్సవము జరుగును, ఆసందర్భమున సుమారు ౧౦౦కి పైగా భజనసమాజములు ౧౬౦౦౦ పైగా ప్రేక్షకులు వేరుస్థలములనుండి పాల్గొందురు. ఈనగర పరిసరములందును, నగరమునందును ఈఉత్సవము గొప్పగా పాటింపబడును. అట ఎల్లప్పుడు ప్రతిశనివారము భజన జరుగుచుండును.



మూర్తి



మంటపము



ఉత్సవ సమయదృశ్యము

## అధికారుల నియామకము

హైదరాబాదు నవ ౨౪

పోలీసు వజారతునందు పర్సనల్ అసిస్టెంటుగానుండిన యస్ యన్ రెడ్డిగారు నాందేడుకు సుపరింటెండుగా మార్చబడిరి వీరిస్థానమున అసిస్టెంటు సూపరింటెండెంటుగారగు అహ్మదుగారు నియమింపబడిరి.

ప్రభుత్వము వారి ప్రకటనశాఖయందు సహాయాధ్యక్షులుగానుండిన యస్. కె. అయ్యంగారుగారు నిజాంకాలేజియందు దర్శనశాస్త్రజ్ఞులుగా యేర్పడిరి.

## "నాద చైతన్యము"

శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయమునందు శ్రీవేదకావ్య స్మృతితీర్థ చి. వ. వీరభద్రశర్మగారి అధ్యక్షతక్రింద శ్రీ పారుపూడి చలమయ్యశాస్త్రిగారు పైవిషయముపై రేపు శుక్రవారం (౨౬-౧౧-౩౭) సాయంకాలము ౬ గంటలకుపన్యసించెదరని కార్యదర్శిగారు వ్రాయుచున్నారు.

## ౪౦౦౦నిర్బంధితులవిడుదల

సం. ప్రాంతముల ప్రభుత్వమువారిఆజ్ఞ

అలహాబాద నవ ౨౩

అనేకమంది నిర్బంధితులవిడుదలచేయుటకు సంయుక్తప్రాంత ప్రభుత్వము వారాజ్ఞల ప్రసాదించినటుల తెలియుచున్నది నిర్బంధితులలో కొన్నివర్గములవారు ప్రత్యేకింపబడిరి. వీరి లిస్టు తయారుచేయబడుచున్నది. ఈ మాసాంతమున సుమారు ౪౦౦౦ లు నిర్బంధితులను విడుదల గావించనున్నటుల రూఢిగా తెలియుచున్నది.

## మహాత్ముని ఆరోగ్యము

సంతృప్తికరముగా నుండుట

వార్ధా నవ ౨౩

మహాత్మ గాంధిగారిఆరోగ్యమునందుచాలా అభివృద్ధి కలిగినది. రక్తపోటు ౨౧౮ నుండి ౧౯౪వరకు తగ్గినది. ఆరోగ్యము సంతృప్తికరముగా గలుగుచున్నదని మహాత్ముని అభిప్రాయముగలదు. సంపూర్ణారోగ్యమునకు విశ్రాంతి యత్యవసరమని డాక్టరులు తెలుపుచున్నారు.


దక్షిణ హిందూస్థానపు గర్వకారణము

## ది యునైటెడ్ ఇండియా

### లైఫ్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

మదాసు. స్థాపితము. 1906

ది యునైటెడ్ ఇండియా భీమా ద్విగుణీకృత స్థైర్యముగలది.

* పాలసీదారుల ట్రస్టుఫండు రు. 85, 00, 000ల కెక్కువ.

* మొత్తముఅమలులోయున్న వ్యాపారము రు. 4, 00,00,000ల కెక్కువ.

వివరములకు దయచేసి ఒక పోస్టుకార్డువ్రాయుండి.

ఆర్. శఠగోపన్, బి.ఏ., హైదరాబాదు బ్రాంచి

లోకల్ మేనేజరు. 1984/2 నిజాంశాహిరోడ్ హైదరాబాదు-ద



## మ. ఘ. వ. నైజాంస్టేటురైల్వే

1937 రంజాన్ సెలవులకు

### తగ్గింపు టిక్కెట్లు

యీరైల్వేలో, ఒకటి, రెండు, మూడు, తరగతులలో తగ్గింపు రిటర్న్ టిక్కెట్లు 25 నవంబరునుండి 8 డిశంబరు 1937 వరకు (రెండురోజులు కలుపుకొని) యివ్వబడును. యీటిక్కెట్లు 14 డిశంబరు 1937 అర్ధరాత్రివరకు తిరుగు ప్రయాణము ముగించుటకు చెల్లును.

1, 2 తరగతులు:—రెండు ప్రయాణములకు. ఒకప్రయాణపు చార్జీకి 1-3/4 వంతులు.

3వ తరగతి:—రెండుప్రయాణములకు ఒకప్రయాణపు చార్జీకి 1-1/3 వంతులు.

3 సంవత్సలములకు పైబడి 12 సంవత్సరములకు లోపడిన పిల్లలకు పైతగ్గింపు చార్జీలలో సగముచార్జీ చేయబడును.

యితర వివరములకు మీకుదగ్గరి స్టేషన్‌మాస్టరుకుగాని, చీఫ్‌కమర్షియల్ మేనేజరు మ. ఘ. వ. నైజాంస్టేటు రైల్వే. (శికిందాబాదుకు గాని, వ్రాయుడు.)


## సర్ జగదీశ చంద్రబోసు నిర్యాణము

ప్రఖ్యాత భారతీయ శాస్త్రజ్ఞుడు

కలకత్తా నవ ౨౩

నిన్నఉదయము హృదయ స్తంభనమువలన సుప్రసిద్ధ భారతీయ సైంటిస్టులు, వృక్షశాస్త్ర నిపుణులు, ప్రపంచవిఖ్యాత ధీమంతులగు సర్ జగదీశ చంద్రబోసు గారు మరణించిరి.

దహనముకొరకు వీరిశవము గిరిధి (సంతాలుపరగణా)నుండి కలకత్తాకు కొనిరాబడినది.

అకస్మాత్తు మరణము

బోసుగారు ఆరోగ్యార్థమై సంతాలు పరగణాయందలి గిరిధికి ౨ నవంబరు తేదీన వెళ్లియుండిరి, తిరిగివీరు ౨౫ నవంబరు తేదీన కలకత్తావచ్చుటకు నిశ్చయించిరి. కలకత్తానుండి వెళ్లునప్పుడు ప్రత్యేకముగా వీరికొకవిధమగు జాడ్యమేర్పడి లేకుండెను. వీరిమరణము ఆకస్మాత్తుగాగలదు. గిరిధియందు వీరు వీరి అన్నకుమారులగు అమృతలాల్ మిత్తర్, సబార్డినేటు జడ్జి, గారివద్ద నివసించియుండిరి.

మోటారులో వీరిశవము తీసుకరాబడి నిన్న సాయంకాలము దహనసంస్కారములు జరిగినవి.

## కళాశాల బహుమాన ప్రదానోత్సవము

రాజమాతిగారు ఉస్మానియా కళాశాల బహుమాన ప్రదానోత్సవమున అధ్యక్షత వహించిరి.

కళాశాల ప్రిన్సిపాలులగు మౌల్విసయ్యదు మొహియొద్దీన్‌సాహెబు రాజమాతి విద్యా పోషకత్వమును, వాఙ్మయాభిమానమును ప్రశంసించుచు కళాశాలనివేదికను క్లుప్తముగా వివరించి సన్మానపత్రమును అర్పించుకొనిరి. రాజమాతిగారు విద్యార్థులకు బహుమానములను ప్రసాదించి, సన్మానపత్రమునకు ప్రత్యుత్తరమొసగుచు "ఈ సంస్థయొక్క ప్రతిష్ఠయు రాష్ట్రము యొక్కయు, రాష్ట్రపతియొక్కయు సేవచేయునని హృదయపూర్వకముగా ఆశించుచున్నా"నని నుడివిరి.

శ్రీ రాజమాతిగారి ఈనెల ౨౨వ తేదిన డు కర్నల్ మొకరంజాహ బహాదురుతో సహా అజంటాకువెడలిరి.

## అలహాబాద అపోహము

అలహాబాద నవ ౨౨

వ్యక్తిగతముగా నగరమునందు చెలరేగిన హిందూమహమ్మదీయ తగవుల వలన నగరమంతయు మతకలహ మేఘాచ్ఛాదితముగా కంపించుచున్నది.

నగర కాంగ్రెసుకమిటీ సమాజమాన్యమున నిన్నరాత్రి మహమ్మదలీ పార్కులో జవాహర్లాలు నెహ్రూగారి అధ్యక్షతక్రింద నగరమునందు సంపూర్ణశాంతి సంరక్షించుటకు ఉభయవర్గములమధ్య భేదభావములు, అపహాసము కలుగకుండుటకు, పలయు ప్రయత్నములు సలుపుటకైనొక బహిరంగసభ సమావేశపరుపబడెను.

నగరమునందవామనులగు యిరువ్యక్తులమధ్యనో కలిగిన పరస్పర కలహములను మతసంబంధముగా నిర్ణయించుట గౌరవార్హము గాజాలదనియు, నగరవాసులందరీ విషయమును తృణప్రాయముగా పరిగణించుట భావ్యమని పండితుడు ప్రజల నుద్బోధించెను. ఇట్టిస్వల్ప విషయములు ఆరికట్టబడకుండుట దుఃఖావహమనియు, దీనివలన ప్రజల, పోలీసువారల అసమర్థతయే ప్రకటితమగుచున్నదనియు నెహ్రూగారు నుడివిరి.

నగరమునందు శాంతి సంరక్షించుటకు స్వచ్ఛంద సేవకదళ మేర్పరచుటకు నిర్ణయింపబడినటుల పండితుడు సభికులకు తెలియపరచెను.

## అగ్ని ప్రమాదము

(ఒక విలేఖరి)

బాలానగరము: నవం. ౨౨

గతవారమున అరువదియేండ్లవయస్సుగల బోయ స్త్రీ వంటచేసికొనుచుండగా శరీరమునకు నిప్పంటుకొనెను ఆమె శరీరమునకంటిన మంట చేసికొనుటలో ఇతరవస్తువు లంటుకొనుటవలన యిల్లు అగ్నిప్రమాదమునకు లోనయ్యెను. కొలుచున్న యింటివారు యిరుగు పొరుగువారు మంటలు ఆర్పి స్త్రీని బయటకుతీసిరి. కొంత ఒకగంటతరువాత ఆ స్త్రీ మరణించినది. పోలీసుపంచునామా చేసికొని దహనమున కాజ్ఞనొసగిరి.

— విలేఖరి

## కాంగ్రెసు సభ్యుల సంఖ్య ౩౧౦౦౦౦౦

గత వత్సరముకన్న ౫ రెట్లు

అలహాబాద నవ ౨౩

ఈసంవత్సరము యింతవరకు బర్మా, సరిహద్దు రాష్ట్రముల సభ్యులసంఖ్య గాక దేశములో ౩౧ లక్షలమంది అనగా ౩౧౩౪౨౪౫ మంది కాంగ్రెసుసంఘమునందు సభ్యులుగా చేరిరని అఖిలభారత కాంగ్రెసుసంఘమువారు తెలుపుచున్నారు.

గతవత్సరము సభ్యుల సంఖ్య ౬౩౬౧౩౧ మాత్రముండెను.

## చేతిపనులవారికిని పారిశ్రామికులను శ్రేష్ఠమైన తరుణము

అల్వాలలో జాతర ౫ బహమన్ ౧౩౪౭ ఫ. నుండి ప్రారంభము కాగలదు పరిశ్రమల ప్రదర్శనము ౧౨ బహమన్ ౧౩౪౭ ఫ. నుండి జరుపబడును. ప్రదర్శనములో స్టేటునుండివచ్చు చేతిపనులు పంటలు, పశువులు, ప్రదర్శింపబడును ఈ సమయములో నిజాంరాష్ట్రపు చేతిపనులు, పారిశ్రామిక వస్తువులు తోటల ప్రదర్శనముకూడ జరుపబడగలదు. ఈప్రదర్శనములో ఏ రకమైన వస్తువులు గాని పంపదలచినవారు ప్రదర్శనమునకు పంపదలచినచో ౧ బహమన్ ౧౩౪౭ ఫ. వరకు ప్రదర్శనశాఖాధికారి (అల్వాలకు) పంపుకొనవలయును. ప్రదర్శనములో ప్రదర్శనవస్తువులకు యేమియు తీసికొనబడదు.

మోతెమదు

ఎస్టేటు పేష్కారి


## ది దక్కన్ టొబాకొవర్క్సు లిమిటెడ్

1913 మరియు 1936 సంవత్సరముల ఇండియా కంపెనీ చట్టముల ప్రకారము యిన్‌కార్పొరేటు చేయబడినది

ఇంగ్లీషులోయున్న కంపెనీ విజ్ఞాపనపత్రిక సరియైనది

నియుక్త మూలధనము రుప్ప. 5,00,000

భాగములు:—రుప్ప 4,00,000 లు ఒక్కొక్కటి రుప్ప 50/- వంతున 8000 సామాన్య వాటాలుగా భాగింపబడినవి. దరఖాస్తుతో రుప్ప 20/- లున్ను, రుప్ప10/- వాటాలు నిర్ణయించినతరువాతయున్న, మిగిలినది మూడునెలలకొకపర్యాయము రుప్ప 10/- కిస్తులుగా భాగనిర్ణయమై ఆరునెలలలోగా చెల్లించుపద్ధతి

రుప్ప 1,00 000 లకు ప్రతిశత 5 రూపాయల మినహాయింపుగల నిర్ణీతరేటు ప్రకారము లాభవిభాగము యివ్వబడు వాటాలు 1000 ఒక్కొక్క వాటా రుప్ప. 100/- లు దరఖాస్తుచేయునప్పుడు రుప్ప 50/- లున్ను, వాటాలునిర్ణయించినతర్వాత మిగిలిన రుప్ప 50/- చెల్లింపవలయును.

నికరలాభముల అందాజా:—యిదేమాదిరి వ్యాపారము చేయుచున్న యితర కంపెనీలవలెనే ప్రతిశత 10, లేక 15 రూపాయల నికరలాభములిచ్చు నమ్మకమున్నది. కంపెనీ విజ్ఞాపనపత్రికలు, ఫారములు ఈక్రింది స్థలములలో దొరకును.

1. రఘునాథమల్ బ్యాంకర్ హైదరాబాదు దక్కన్
2. పాట్నె అండుకో, లిమిటెడ్. శికిందరాబాదు
3. కమర్ ఆప్టెఅండుకో లిమిటెడ్. మ్యానేజింగు ఏజంట్లు

దక్కన్ టొబాకొవర్క్సు లిమిటెడ్, 180 బుధ్వార్ పేట పూనా 2